Regd No. N. 45 / M 3813

వెల ఒక అణా

102875

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సింగపూరు సముద్రంలో మందుగనులు

యుగోస్లావియా ఒత్తిడికి జర్మనీ షరతులు

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ర మాఘ బ॥ ౯ (౧౬-౫-౧౩౫౦ ఫ.) గురువారము సంచిక ౨౦

# బ్రిటను కోరిక యెడ బల్గేరియా వైఖరి

## సింగపూరు సముద్రశాఖద్వారంలో మందుగనులు

### జాగ్రత్తకై బ్రిటిషుఅధికారులచర్య

గతసంచికలో జపాను సింగపూరుమీదికి దూకుటకుసన్నాహాలు చేయుచున్నదని ఆస్ట్రేలియాప్రభుత్వములోని ముఖ్యమంత్రులును, అమెరికాసంయుక్తరాజ్యపు ముఖ్యాధికారులును అనుమానించుచు ఒకవేళ ట్రియుద్ధమే ప్రారంభమైనచో ఏమిచేయవలెననువిషయమై జాగ్రత్తగా కనుపెట్టుచు ఆలోచనలు చేయుచున్నట్లు మాచియుంటిమి. ఇప్పటికిని ఆఅనుమానములు, ఆ ఆలోచనలు ఆజాగ్రత్తలుఆట్లేయున్నవి విశేషముగా ఆస్ట్రేలియా తాత్కాలిక ప్రధానిఫాడన్ గారును, ఆస్ట్రేలియాశాసనసభలోని ప్రభుత్వప్రతికూలపక్షనాయకుడగు కర్టిన్ గారును జపానుదక్షిణసముద్రంమీదపడి యుద్ధము చేయబోవుచున్నది జాగ్రత్త జాగ్రత్తయని చేసిన హెచ్చరికలవల్ల ఆస్ట్రేలియాప్రజలు ఆందోళితులైనట్లు ఆస్ట్రేలియాప్రభుత్వపునావికాశాఖమంత్రి హ్యూస్ గారు ఫిబ్రవరి ౧౫ వ తేదినాడు బ్రాడుకాస్టులో తెలిపినారు. అయినను ధీరులకెట్టిఅందోళనగాని ఉండవలసినఅవసరములేదుగనుక త్వరలో ఈఅందోళన తొలగగలదనివారుచెప్పిరి. మొత్తముమీద జపానుయుద్ధములో దూకగలదనుభయమునకు తగినఅవకాశములుండ నేయున్నవని వారుఒప్పుకొనినారు ఫిబ్రవరి ౧౫ వ తేదినాడు ఆస్ట్రేలియావిదేశాంగమంత్రి స్పెండర్ గారుకూడ యుద్ధభయానికి అవకాశమున్నట్లేచెప్పిరి. ఆస్ట్రేలియాకార్మికనాయకుడగు కర్టిన్ గారుకూడ ఫిబ్రవరి ౧౫ వ తేదిన తెల్పినవిషయాలలో జాగ్రతగా యుండుటఅవసరమనిరి. న్యూజీలెండు ప్రధానమంత్రికూడ ఫిబ్రవరి ౧౭ వ తేదినాడ పరిస్థితి చెడిపోవుచున్నదనిరి.

ఈవిధంగాఆస్ట్రేలియాలోను, న్యూజీలెండులోను నాయకముఖ్యులు అందోళనకరపరిస్థితియున్నట్లుహెచ్చరించుచుండ, అమెరికాలో రూజ్వెల్టు, స్టేటుసెక్రెటరీకార్డెల్ హల్లు మున్నగువారలుపైకిచెప్పుటలో ఘోరపరిస్థితిఏమిగాని లేదనుచునే, ఘోరపరిస్థితియని తలచునప్పుడు చేసేచర్యలుచేయుచున్నారు. జపానులోను, జపానువారిఅధికారానికి లోబడియుండే ఉత్తరచైనా మున్నగుప్రదేశాలలోను, జపానుయుద్ధానికే పూనుచో ఆయుద్ధంవల్ల ఏప్రదేశాలలో అవస్థలుకలుగవచ్చునని భయమున్నదో అట్టిచోటులాందుమున్నగుప్రదేశాలలోను అమెరికాజాతీయులు అవసరములైనపనులు లేనిచో వెంటనే స్వదేశమగు అమెరికాకుచేరుకొనుట మంచిదనివారలకు తెలియచేయించినారు. పైకిమాత్రము ఏదేవో, అదంతామామూలుగా ఇచ్చేఅజ్ఞలే అనిఅంటున్నారు. అమెరికాసంయుక్తరాజ్యప్రధాననగరమగు వాషింగ్టనులో అమెరికా ముఖ్యాధికారులును, బ్రిటిషురాయబారి హాలిఫాక్సుప్రభువుగారును, ఆస్ట్రేలియారాయబారి కాసీగారును ఫిబ్రవరి ౧౫ వ తేదినాడు ఈజపానుభయమునుగూర్చియే ఆలోచనలుచేసినారు. జపానుతూర్పుప్రాంతములోవచ్చివారిఈస్టిండీసుదీవులపైకిదూకితేదూకవచ్చుననుభయముతో వచ్చివారినికూడ బ్రిటిషువారును అమెరికావారును ఆలోచించుచున్నారు. వాషింగ్టనునగరములో వచ్చిప్రభుత్వపురాయబారియగు కార్డెల్ హాల్ గారు ఫిబ్రవరి ౧౫ వ తేదిన హాలిఫాక్సు గారితో మాట్లాడినతర్వాత వచ్చిరాయబారితో సంభాషించిరి ఈ సంభాషణతర్వాత వచ్చిరాయబారి పత్రికావిలేఖులతో జరిగినసంగతిని తె లు పు చు

ఈస్టిండీస్ పైకి ఎవరువచ్చినను వచ్చిప్రజలు ఊరకుండరనిచెప్పిరి. లండనునగరంలో ౧౫వ తేదిన ఒకవచ్చి బ్రాడ్ కాస్టులో ఈస్టిండీసు ప్రజలు లేనిపోని యుద్ధభయపు వదంతులను నమ్మి క్రుంగిపోవద్దని హెచ్చరికచేయబడెను. లండనులో బ్రిటిషుప్రభుత్వమువారు అక్కడనుండే వచ్చి ప్రభుత్వముతోడ ఎప్పటికప్పుడు సమాచారములను ఆలోచించుచునేయున్నారు బ్రిటిషుప్రభుత్వమువారు పసిఫిక్ ప్రాంతానికి అంతకంతఎక్కువగానేసేనలను పంపించుచున్నారు. సింగపూరు సముద్రశాఖలోకి ప్రవేశించేద్వారంవద్ద బ్రిటిషుఅధికారులు మందుగనులను నాటించినారు తాయిలాండుకు, బ్రిటిషువారి మలియాస్టేట్సునకు మధ్యనుండే సరిహద్దువద్ద భూసేనలను, నౌకాదళములను, వైమానికదళములను ఉంచినారు ఇట్లుచేయుటవల్ల బ్రిటిషువారు తాయిలాండును ఇండోచైనాతో పెట్టుకొన్న వివాదపరిష్కారానికి జపానుమధ్యవర్తిత్వమును అంగీకరించినందువల్ల తాయిలాండురాజ్యమునే ఆక్రమించుకొనునేమో యని తాయిలాండు ప్రజలు అనుమానపడసాగిరి అందుపై తాయిలాండు ప్రభుత్వమువారు ఫిబ్రవరి ౧౭వ తేదిన గావించినఒక ప్రకటనలో అట్టిభయములేదనియు ఇటీవలనే తాయిలాండు, బిటను ఒకరిరాజ్యాలపై ఒకరు దండెత్తమనుఒడంబడికకుబద్ధులైయున్నవనియు చెప్పినారు. తాయిలాండు ఎవరికిగాని శత్రువుగానుండక అందరితోను మైత్రితోనుండదలచియున్నదికాబట్టి, బ్రిటనుతో జపానుయుద్ధముచేయదలచినచో తాయిలాండు అందులోచేరదని తాయిలాండులోని పత్రికలలో అభయవచనములువ్రాయబడుచున్నవి. జపానువారాక్రమించియున్న చైనాలోను, తాయిలాండులోను బ్రిటిషుప్రజలులేచివచ్చుటమంచిదని వారలకు బ్రిటిషుప్రభుత్వమువారు సలహాలిచ్చినారు.

చైనావారుకూడ జపాను బ్రిటనుకు సంబంధించిన తూర్పుఖండపు రాజ్యాలలో దేనిపైకిగాని దూకుటకు ఆయత్తమగుచున్నదని ఆరోపణలు చేయుచున్నారు. ఇపుడువెంటనే దూకినచో ఇంకొకవైపు రష్యావారు తనమీదికెక్కుదురేమో అని జపానుభయపడుచున్నదట. అందువల్ల రష్యాతో ఏదోఒక సమాధానముకుదుర్చుకొనుటకై ముందుయత్నించుచున్నదని చైనావారిఆరోపణ. జపానుసేనలు దక్షిణ పసిఫిక్ ప్రాంతంలో హైనాన్ దీవిలోను, కాంటనులోను, హైనాన్దీవిలోను, సిపాదీ సీమలలోను, స్ప్రాట్లీ దీవులలోను ఫ్రెంచి ఇండోచైనాలోను ఉన్నవని చైనావారనుచున్నారు, హైఫాన్గులోను, హనాయిలోను ఉండే జపానుసేనలను పైగాను, క్వాంగ్ అఖాతమును ఆక్రమించుకొనుటకై ఉపయోగించేరని చైనావారలనుచున్నారు. సింగపూరుపై దూకుటకు జపాను తాయిలాండులో నౌకాస్థావరాలను కోరుచున్నదనుమాటకూడ తాయిలాండు గారు ఖండించినారు.

జపానులో బ్రిటను, అమెరికాలు చైనాలో ఇపుడున్న చియాంగ్ కైషేక్ గారి ప్రభుత్వానికితోడ్పడుచు జపానునకు విరోధముగనుండుటవల్లజపానుదక్షిణపుప్రాంతరాజ్యములనుఆక్రమించుకొనుటకై పోవలసివచ్చుచున్నదని వ్రాయుచున్నవి. వసంతకాలములో హిట్లరు బ్రిటనుమీదికి దూకగానే జపాను తూర్పుఖండములో బ్రిటిషువారిరాజ్యాలపైకి దూకవచ్చునని బ్రిటిషువారును, అమెరికావారును లేనిపోని ప్రచారముచేయుచున్నారని అపత్రికలనుచున్నవి. కానిజపానుప్రభుత్వముయొక్క గొప్ప అధికారియొకడు ఫిబ్రవరి ౧౮వ తేదిన పత్రికలవిలేఖులతో సంభాషించుచు పరిస్థితి ఆందోళనకరముగానున్నను ఏమీ కాదని చెప్పిరి ఆస్ట్రేలియాప్రభుత్వంతో మైత్రినినిలుపుకొనవలెననియే జపాను శ్రద్ధగలిగి యున్నదనిరి. ఈస్టిండీసుదీవుల అధికారులతో ఆర్థికసౌకర్యాలకై జపానుసంభాషణలు సరసంగానే సాగుచున్నవనిరి. ఇతరదేశాలలో జపానుప్రజలు జపాను అమెరికాలమైత్రిచెడి తమకు చిక్కువచ్చునని భయపడనక్కరలేదు. తమతమవ్యాపారములను సాగించుకొనుమనసవలెనని అభయవచనములు జపాను ప్రభుత్వముచే పంపబడినవి.

జపానుప్రభుత్వమువారే అమెరికాకు క్రొత్తగా పంపించిన రాయబారి అడ్మిరల్ నోమూరాగారు తమసనదును రూజ్వెల్టుగారికి ఫిబ్రవరి౧౪వతేదిన సమర్పించుకొనినపుడు, రూజ్వెల్టుగారు జపాను అమెరికాల సంబంధములలో క్లిష్టపరిస్థితి ఏర్పడియున్న సంగతి ప్రస్తావించగా నోమూరాగారు తాపరెండుదేశాలకు సామరస్యము ఉండేటట్లు చేయుటకును, అవిధంగా పసిఫిక్ ప్రాంతంలో శాంతిఉండేటట్లు చేయుటకును యత్నించెదనని వాగ్దానమిచ్చిరి. రూజ్వెల్టుగారుమాత్రము అమెరికా బ్రిటనుకుసహాయముచేయుట తప్పదనిచెప్పిరట. చైనావిషయంలోకూడ అమెరికా ప్రజలకు ఆందోళనయున్నదని చెప్పిరట.

ఇపుడు అమెరికా సంయుక్తరాజ్యపు నౌకాశాఖవారు పసిఫిక్ ప్రాంతంలో పూర్వము జర్మనీదిగానుండినట్టియు, ఇపుడు న్యూజీలెండుక్రిందనున్నట్టియు ఒకనౌకాశ్రయమును సంపాదించుకొనుటకై ౧౬,౦౦,౦౦౦ డాలర్లను వ్యయముచేయదలచిరి.

#### చైనా, జపానుల యుద్ధము

జపానువారు "యుల్లో"ఆశానదియొక్క ముఖద్వారముగనుండిన క్రొత్తదాడి ప్రారంభించినారు. చైనావారు దక్షిణహోనాను రాష్ట్రంలో జపానుసేనలపై దెబ్బతీయుచున్నారు ఇపుడు చైనాసేనలు తాంషూయినగ్గరనుండే జపానుసేనలమీదికి పోబోవుచున్నవి అక్కడి జపానుసేనలు హాంగ్ కొంగునుండి, చైనాలోపలి భాగములకున్న రాకపోకలసంబంధములేకుండచేయుటకు యత్నించుచున్నారు.

#### బాల్కన్సులపై జర్మనుల సంచలనము

బాల్కను ప్రాంతములందు రుమేనియాలోను బల్గేరియా సరిహద్దులలోను, జర్మనుసేనలును, విమానములును అధికముగా చేర్చబడియున్నవి. జర్మనుసేనలు బల్గేరియాలో ప్రవేశించి అక్కడినుండి గ్రీసుమీదికి పోవచ్చునని భయపడుచున్నారు. ఇట్లుబల్గేరియాలో జర్మనుసేనలుప్రవేశించుట బల్గేరియా తాటస్థ్యమునకు భంగకరము కాబట్టి ఆసేనలనుతమదేశంలోనికి ప్రవేశించనీయమని మాట ఇవ్వవలసినదిగా బ్రిటిషు ప్రభుత్వమువారు బల్గేరియాను రెండువారాల క్రిందట కోరియుండిరి. ఫిబ్రవరి౧౭వ తేది రాత్రి బల్గేరియాలోని బ్రిటిషురాయబారి బల్గేరియా ప్రభుత్వ విదేశాంగమంత్రితో ఒకగంటసేపు సంభాషించి బ్రిటిషు ప్రభుత్వముయొక్క అభిప్రాయమును తెలిపిరి. బల్గేరియాలోగుండా జర్మనుసేనలు గ్రీసుపైకిపోనిచ్చినచో బ్రిటిషుప్రభుత్వము బల్గేరియాతో మైత్రినితెగతెంపు చేసికొని, తదనుగుణమైనచర్యను గైకొనగలదని బల్గేరియా విదేశాంగమంత్రికి స్పష్టము చేయబడెను ఇపుడుబల్గేరియా ప్రధాని బ్రిటను కోరినయట్టి వాగ్దానము నీయజాలమని చెప్పినట్లు తెలియుచున్నది.

ఇదిఇట్లుండ జర్మనీ ప్రభుత్వమునుండి పిలుపురాగాపోయి యుగోస్లావియాప్రధానియు, విదేశాంగమంత్రియు ఫిబ్రవరి ౧౫వ తేదిన హిట్లరుతో సంభాషించి తిరిగి స్వదేశముచేరుకొనిరి ఏమిసంభాషించినది నిజము తెలియుటలేదు. యుగోస్లావియాలోని మొరావామీదుగా గ్రీసువారిసాలోనికామీదికి జర్మనుసేనలనుపంపించుటకు ఒప్పుకొనవలసినదిగ జర్మనులుకోరినట్లు కొందరు ఊహించుచున్నారు. మరికొందరు బల్గేరియాగుండా జర్మనుసేనలను పంపినచో యుగోస్లావియావారు ఆక్షేపించరుగదా యని జర్మనులుఅడిగినట్లు చెప్పుచున్నారు మరికొందరు యుగోస్లావియాను జర్మనీ, ఇటలీ, జపానుఒడంబడికకు హంగరీవలెనే యుగోస్లావియాకూడ బద్ధముకావలెనని కోరినట్లుచెప్పుచున్నారు. ఈ కపటపు కోరికకు యుగోస్లావియా ప్రతినిధులు తమ రాజుగారితో ఆలోచించిగాని సమాధానముచెప్పజాలమని తిరిగిపోయిరని వారలనుచున్నారు

రుమేనియాలో తుర్కీ పత్రికల ప్రతినిధులను జర్మనుల ప్రేరణచే అరెస్టులు చేయుటవలనను

#### ప్రధానమంత్రిగారికి సన్మానము

(ఒ-వి)

కాశేపల్లిస్టేషన్, ఫిబ్రవరి౧౫

నిన్నటిరోజు డోర్నకల్ నుండి ప్రధానమంత్రిగారు కొత్తగుడెంవెళ్లుమార్గమున ఈ గ్రామమున స్టేషనుపై శ్రీయుత నారాయణరావు, సౌకటు మాష్టరు గారిచే యీపూర్తి ప్రాథమిక పాఠశాలకు శోరపిరదళముచే, స్వాగతమీయబడెను. మంత్రివరేణ్యులువారిని బండినుండిదిగి సందర్శించి సౌకటు మాష్టరు గారిచేవారిని పరించికొన్న ప్రశ్నలనడిగి పిల్లలరాకకై సంతోషించి వారికి రు ౫ మిఠాయిపంచుటకైయిచ్చిరి. మంత్రివరేణ్యునికి చీయన్సుఇచ్చినతర్వాత మంత్రివరేణ్యులు కృతజ్ఞత తెల్పిరి. బండికదిలెను.

#### డేనిష్ టార్పెడోబోట్లను జర్మనులు ఉపయోగిస్తున్నారు

బుధవారంనుంచీ జర్మనులు, కొందరు డేనిష్ టార్పెడోబోట్లను జర్మన్ పతాకంక్రింద నడుపుచున్నారట. డేనిష్ టార్పెడోబోట్లను, సబ్మెరైనులనూకూడ జర్మనులు ఉపయోగిస్తున్నారని గత వారంలోనే ఇక్కడవార్తలు ప్రచారంలోకివచ్చినవి. బాల్టికసముద్రంలో చర్యలుజరుపుటకు, తమనావికులను శిక్షణనిచ్చుటకు ఈటార్పెడోబోట్లు ఉద్దేశింపబడినవి జర్మనులు డెన్మార్కును ఆక్రమించుకున్నప్పుడు చేసుకున్న షరతులకు ఇది ప్రథమభంగము అటువక్రవర్తి విశ్వాసానికి ఇట్లు కూడా పాత్రులగుచు జర్మనులు చెప్పినట్లు వినే మంత్రిని పెట్టాలెనని కృషిచేస్తున్నారట.

అమెరికా ప్రతినిధి

రూజ్వెల్టు అధ్యక్షుని అంతరంగిక ప్రతినిధి అగు హారిహాప్కిన్సు ఇంగ్లాండులో తనకార్యక్రమము ముగించుకొని అమెరికాకు ఫిబ్రవరి ౧౬వ తేది బయలుదేరెను.

రుమేనియాల సరిహద్దుపట్టణమగు కాన్స్టాన్జానుండి తుర్కీలోని ఇస్తాంబూలునకు నడచు ప్రయాణీకుల రైలుబండిని రద్దుచేయుటవలనను రుమేనియాతుర్కీల మైత్రి చెడిపోయున్నది. రుమేనియాలో వారిపుడు బ్రిటనుకుఅనుకూలమైన అభిప్రాయము గలిగియున్నారు రుమేనియాలో ఐరన్ గార్డు పార్టీయొక్కటే ఒప్పుకోబడునని ఇదివరలో జనరల్ ఆంటొనెస్కూగారు చేయించియుండిన శాసనమిపుడు తీసివేయబడినది. మరల రుమేనియాలో క్రొత్తగా అల్లరులురావచ్చునని భయము కలుగుచున్నది.

# గోలకొండసనదు

## అందలి విశేషాలు

(శ్రీ) సురవరము ప్రతాపరెడ్డిగారు

గతవ్యాసములో సనదులోని కొన్ని విచిత్రప్రయోగాల వివరణమునకు తెలిపినంతవరకు తెల్పుకొంటిని. ఇంకను రెండుమూడువిషయాలు సపరలసియున్నది. వాటినింక తెలిపి విషయసమాప్తి గావించుచున్నాను.

### గోకుల్‌దాసు బావి

"కొండయ్య తానుచేసియుంగిన యీవత్తుకమును బయానుచేసి చాలకు చూయించి సాగోకుల్‌దాసుబావిలో బంగారిపుతిలీ ఆయువుకరామతుచెప్పి అస్లు మహాత్తుఅంతా చూచెవని సనదులోకలదు. దీనికథయేమనగా:- గోలకొండకోటకట్టిన కాలములో తత్పరిసరాంతాలలోని చిన్నచిన్నగట్లలో సాధూగోకుల్‌దాసు అనువాడు నివాసము చేసియుండెను. ఆప్రాంతాలలో కొండయ్యమేకల మేపుతూ గోకుల్‌దాసునకు దినమున్నూ మేకపాలనిచ్చువచ్చెను. కొంతకాలమిట్లు ఉభయులకు మైత్రికుదిరింది. ఒకనాడు సాధువు ఒక పెద్ద ఇనుపకుపెట్టి దానిలోనూనెపోసి సలసలకాచుచూండెవాడు కొండయ్యచెంబులో పాలుతెచ్చి సాధువుకిచ్చినాడు, సాధువు వాటిని త్రాగి "అరే కొండయ్యా నీకుప్రత్యుపకారం చేయవలెనని బుద్ధిపుట్టింది. ఇటురా. ఈకాగుచుట్టును ప్రదక్షిణ నమస్కారములుచెయ్యి" అన్నాడు అమాయకుడగు కొండయ్య ఆజ్ఞచేసినాడు. మూడవప్రదక్షిణముచేయుచుండగా సాధువు కొండయ్యను నిశ్చయముగాపట్టి కాగులోవేయబోయినాడు. ని కొండయ్య సాధువుకంటే బలాఢ్యుడగుట పట్టుతప్పించుకొని ప్రక్కకు దుమికినాడు. నా నీప్రత్యుపకారం అని మహోగ్రుడైనకోపముతో సాధువునే తటాలునఎత్తి కాగులోపారవేసినాడు, అంతలోనే ఆశ్చర్యమగు పరిణామము సంభవించెను. సాధువు మాయమయ్యెను. అతని స్థానములో ఆకాగుచున్ననూనెలో ఒకపెద్దబంగారు విగ్రహము కనబడెను, కొండయ్యభయపడి ఆ విగ్రహాన్ని సమీపమందుగల ఒకబావిలో పారవేసిపోయెను. ఆబావినే యిప్పటికిని గోకులదాసుబావిఅని యందురు. ఈవిగ్రహమునే తర్వాత కొండయ్య ఇబ్రహీంకుతుబుషాకిచ్చెను. ఆవిగ్రహములోని విశేషమేమనగా దినముఒకఅవయవము తీసివేసినచో మరునాటివరకు మరల ఆయంగము యథాప్రకారము పెరుగుచుండెనట. అట్టిఅద్భుతమైన విగ్రహమునుండి వచ్చినబంగారుతో కోట కట్టింపబడెనట. ఇదిబంగారు (పుతిలీ) బొమ్మకరామతు (మహత్తు) యొక్కకథ.

ఈకథ నిజమోకాదో మనము చెప్పజాలము. ఇట్టికథయే కొండవీటికైఫీయత్తులో కలదు. దానినిందుదహరించుచున్నాను.

"అనిపోతయ వేమారెడ్డిగారు ప్రభుత్వమునకువచ్చిన సమయమందు ఒకగొల్లవాడు మేకలు గాసేనిమిత్తము బొల్లుమూరు వేంకటేశ్వర స్వామివారువున్న కొండకుపోయి మేకలమేపుతూ వుండివుండగా ఒకసిద్ధపురుషుడు కామ్యార్థియై వేంకటేశ్వరాలయమువద్ద తపస్సు చేసుకుంటూ వుండగా యీగొల్లవాడు ఆయన యోగక్షేమము అడిగినాడు. 'నాకునిత్యమున్నూ క్షీరములు యివ్వవలెను'' అని సాధువు అడిగినాడు. సన్యాసి ఒకనాడు గొల్లవాన్నిచూచి నీవు నిత్యమున్నూ రొక్కడెక్కడవుండే చెట్లఆకులు మేకలుమేపుతుంటావుకదా యేవృక్షాన్ని అయినా మేకలు మేయగానే తిరిగివెంటనే ఆకుపుట్టినట్టు దృష్టమైతే నాకుచెప్పుమన్నాడు. ఆగొల్లవాడు కొన్నిదినములు శోధనచేయగా దృష్టమైనందున సన్యాసికి చెప్పగా ఒకదివసశుద్ధిచూచి ఆచెట్టును తగలపెట్టించి వృక్షము దగ్ధమయ్యే సమయంలో గొపకుని చెయ్యిబట్టి ప్రదక్షిణచేస్తూ వానినియేమరించి మంటలో పడదోయ్యబోతే వాడు వుష్టికలిగినవాడు కనుక గొల్లవాడులోబడక బహుదినాలనుంచి నా మేకలపాలుతాగి నాకువుపకారంచేస్తానవినమ్మించి నన్ను అగ్నిలోవేసి చంపజూచినావా అని సన్యాసినిపట్టి జ్వాలలోపడదోసి తనయింటికివచ్చి మరువాడు తిరిగి మేకలుతోలుకొని అస్థలానికి వెళ్లిచూచేవరకు బంగారం ప్రతిమయై మనుష్యప్రమాణపువిగ్రహముగా నిలిచివున్నందున గొల్లవాడు పూర్వమైత్రమ్యముచేత తనగొడ్డలితీసికొని ఆవిగ్రహముయొక్క హస్తమును ఛేదించేవరకు యథాప్రకారం హస్తమావిర్భవించె. వాడు ఆశ్చర్యపడి వాడు ఆబంగారం తీసుకొని పెట్టికిద్చి తినకుకావలసినవాగాకు తమలపాకులు యీవరస ప్రవర్తిస్తూండగా ఆ కోమటి ధనికుడైనందున, యీసంగతి చారులవల్ల అనపోతయరెడ్డిగారు విని వైశ్యునిపిలిపించి దండించి ఆడిగినంతలో వున్నస్థితి మనవిచేసెను. గొల్లవానిద్వారా సువర్ణప్రతిమనుతీసికొని దానిద్వారా రాజ్యవిస్తీర్ణము చేసెను. తదనంతరము కొమరగిరివేమారెడ్డి ప్రభుత్వమునకువచ్చి అధర్మకర్తను దయ్యెను. యీదినములో వరసచెడి సువర్ణవిగ్రహమున్ను మాయం అయినది''

మరియీకొండవీటి "కరామతు''లో ఎంత సత్యమున్నదో, కొండవీటికరామతునకు కైఫీయతు ప్రమాణము, "గోకుల్దాసుపుతిలీ''కి యీగోలకొండసనదేప్రమాణం. అట్లైతే యీసనదుకూడా అబద్ధపుసనదుగా ఉండవచ్చును. ఇదియు కల్పనయేమో అను సంశయములు కలుగకపోవు.

### సనదుయొక్క ప్రామాణ్యత

ఈసనదుపుట్టినది నిజమైనదిగా కనబడుచున్నది. ఏలనన తెనుగులో సనదును మొదలువ్రాయించి తర్వాత దానినే ఫార్సీలో వ్రాయించినారు. అయితే యీరెండును కల్పనలుగాఉండగూడదా యనిన తర్వాతికాలములో సనదులో కనబరచిన హక్కులు కొండయ్య వంశమువారికి వర్తించుచు వచ్చినట్లు దాఖలాలు తెలియవచ్చుచున్నవి. పైగా ఆసఫ్‌జాహీ వంశపు నిజామైన నిజాముద్దౌలా సనదుఒకటి కొండయ్య వంశమువారివద్ద కలదు. అదిౘ౧౮౫ హిజ్రీలో ఇయ్యబడినట్టిది. అనగా సరిగా ౧౫౧ఏండ్లక్రిందటిది. అప్పుడు మహారాజా చందూలాల్ మంత్రిగా ఉండెను. ఆసనదులో ఇట్లువ్రాసినారు.

"గోలకొండఖిల్లావద్ది దోపావర్ జమీనున్నూ' కోటలోని యెల్లమ్మయున్ను, కోటబయటి రేపల్లెవాడలోని మక్రిమాత వాగరఘురిమల్లన్న మఠము యాదవపీఠముయొక్క అధికారమును పూర్వముప్రభువులు అనగా ఖుతుబుషాహీలు ధన్గర్‌కిష్టయ్య పూర్వికులకుఇచ్చినారు కనుక మొత్తంరాష్ట్రంలో జాతరలు, సంతలుమున్నగునవిజరిగినప్పుడు ధన్గర్‌కిష్టయ్యకు ౧౨ గొల్లకులాలపైనను ౨ కురుమకులాలపైనను యాజమాన్యము కలదనియు కిష్టయ్యపొయిన తావులందెల్లను సర్కారీఅధికారులు అతనికితని హక్కులను వసూలు చేసుకొనుటలో సాయపడవలెను. పైగా గోమారం మర్లగూడెంలో ౩౦౦భిగాలముక్తాయున్నూ రామస్వామి గుట్టవద్ద ౩ అకుభీగాల భూమియున్నూ అతనికే యీయున్నది''

పైసనదేకాక వీరివద్దమరొకసనదుకలదు. అదికూడా ౧౦౬౧హిజ్రీలో అబ్దుల్లాఖుతుబ్‌షాచేత కొండయ్యపేర ఇయ్యబడినది. అందులోను కొండయ్యకిచ్చినహక్కులు పాలింపబడునని వివరింపబడియున్నది.

ఇంకొకసనదుకూడ ఈవంశమువారివద్ద కలదు. అది ముఖ్తారుల్‌ముల్కు సర్‌సాలార్జంగుమొహరుతో ౧౨౭౩ హిజరీలో ఇయ్యబడినది. అందలి ముఖ్యవిశేషమేమనగా సనదు కొండబాలయ్యపేరట ఇయ్యబడినది. (ఇతడు కొండయ్యవంశమువాడు) "పూర్వసుల్తానులు అనగా సుల్తాన్‌అబ్దుల్లాఖుతుబ్షాయొక్కయు నిజామలీఖాన్‌యొక్కయు సనదునుబట్టియు రాజా చందూలాల్‌యొక్క ఫహిమాయిషునుబట్టియు యీ బాలయ్య కరేలీ, అయినూరు, మేలారం,అయ్యారం, మరేగావూ, ఖండబా మున్నగుస్థలాలలోజరుగుజాతరలలో బీరప్ప, మల్లన్న మున్నగు జాతరలలోను ఏయేహక్కులు వీరికికలవో అవన్నియుఅనుభవించుటకు అధికారముకలిగియున్నాడు-

దీనివలన తెలియునదేమనగా అబ్దుల్లాఖుతుబుషా ఇచ్చినసనదును నవాబు నిజామలీఖానున్నూ, చందూలాల్‌మంత్రియున్నూ, సర్ సాలార్జంగు మంత్రియున్నూ నమ్మినారు, సత్యమని నిర్ణయించినారు. తామున్నూ సనదుల నిచ్చినారు.

### స్థలాలు

ఇతరసనదులో కొన్నిగ్రామాలపేరులుకలవు. అందు గోమవరంఅనునది మెదకు తాలూకాలో ఉన్నది, మర్లగడ్డఅనునది గోమవరంలోనిపొలము పేరు. రామస్వామిగుట్టు అనునది గోమవరంవద్దనుండుగుట్ట. అచ్చట రామస్వామిదేవాలయం కలదు. కొమరవెల్లిగ్రామం జనగాం తాలూకాలో ఉన్నది, ఐనూరు, మేలారం, అయారంమాతే గాంవద్ద నున్నవి.

### మరికొన్ని పదాలు

కొండయ్యసనదులో తగరుజోగోడులను పదముకలదు. తగరుజోగువారు అనునదొక జాతిపేరు. దనురువంటి భిక్షనివాయించు వారు బిచ్చమెత్తుదురు.

### కాట కోటయ్య

౧౨గొల్ల, ౨కురుమకులాలకు పెద్దఅయినవారి పేరు.

### మందుచ్చోడు

బిచ్చముతోబ్రతుకు ఒకజాతి. వీరు కను పేడచేతనుచేసి ౧౦౦వరకుసంఖ్యగలలను ఒకపెద్దపెట్టెలోపెట్టుకొని వత్తురు. గొల్లలవద్దనే వారికులగోత్రాలు చెప్పి బిచ్చమెత్తుదురు.

సనదుఇచ్చిన అబ్దుల్లాఖుతుబ్షా అబుల్ తానీషాకన్న ముందువాడు. అతడు ౧౬౨౬నుండి ౧౬౭౨వరకు గోలకొండను పాలించెను. ఈకొండయ్యసనదు ఫలము ౧౦౬౧హిజరీ అనగా ౨౯౦ఏండ్ల క్రిందట చెప్పిన ఈసనదు క్రీ.శ. ౧౬౫౧ ఇయ్యబడినది స్పష్టమగుచున్నది. అనగా రాజ్యకాలములోనే ఇయ్యబడినది.

ఇవి యీకొండయ్య సనదులోని వి

# పాల్వంచ సంస్థాన నూతనరాజధానీనగరభవన ప్రవేశోత్సవము

## సర్ అక్బరు హైదరీగారి ఆగమనము

చాలకాలమువరకు ఈ సంస్థానమునకు పాల్వంచరాజధానిగ జేసికొని ఆంధ్రప్రభువర్యులు పరిపాలించిరి. ఆనాటికోటగోడలు బురుజులు, కందకములు శేషము లయినను ఇప్పుడు పాడుపడి ఒకచిన్న పల్లెగామారినది. అచ్చటకు ఒకమైలు దూరములో యిల్లెందుబూర్గంపాడురోడ్డు దరిని ౨౫౦ ఎ వైశాలమైన విశాలమైన ఎత్తుప్రదేశమునకు కోర్టుఆఫ్‌వార్డ్సువారు నవీనపద్ధతులతో సంస్థానమునకు నూతనముఖ్యపట్టణమును నిర్మింపబూని పోలీసుమొహతెమీం, జంగ్లాతుమొహతెమీం రివిన్యూజూడిషల్ కచ్చేరీలు, క్వార్టరు, పోలీసు క్వార్టర్లు, టప్పాఖానా, ఆసుపత్రియున్నగునవి కట్టించిరి. ఉద్యోగస్థులుండుటకు వసతులుకూడ ఏర్పాటుచేయుచున్నారు. రైతులకుగడ్డియిండ్లు కట్టించబడినవి. స్కూళ్ళు, క్లబ్బు, మార్కెట్టు, దేవాలయం, మసీదుమున్నగునవి కట్టించుచున్నారు. నీటివసతులు ఎలెక్ట్రిసిటీకూడ ఏర్పాటులకై యున్నవి. ౩,౫ బావులు ఫారెస్టునర్సరీయును నిర్మింపబడినవి. నగరమంతయు ౩ అడ్డరోడ్లు, ౫, ౬ నిలువురోడ్లును ఇరుప్రక్కల చల్లనినీడనిచ్చు చెట్లను వేయబడినవి. ఇట్టినూతనరాజధానీనగరమంతయు జండాలతోను, తోరణములతోను, సింహద్వారములతోను చక్కగ శృంగారింపబడినవి, రివిన్యూ జూడిషియల్ ఆఫీసుయెదుట పెద్దదేరా ప్రత్యేకపెండాలుగావేయబడి సోఫాలతోను అలంకారములతోను రాజదర్బారుగ నొప్పియున్నది. ఇట్టినూతనరాజధానీ నగరభవన ప్రవేశోత్సవము ౧౧-౫-౫౦ తారీఖు ఉదయం ౧౦ గం. ౧౫ ని లకు మహాఘనతవహించిన శ్రీనిజాం ప్రభుత్వపభాధ్యక్షులగు డిక్షటులుఅసరబుల్ నవాబుసర్ అక్బరు హైదరీ హైదరునవాజుజంగు బహద్దరుగారిచే అత్యంతవైభవోపేతముగ జరుపబడినది సర్ అక్బరు హైదరీగారు నగరముప్రవేశించగనే పోలీసుమొహతెమీం సా॥ సంస్థానరిజర్వు పోలీసుసలామీచేసెను. శ్రీరాజావారు,రివిన్యూ డైరెక్టరుజనరల్ క్రాఫ్టన్ చౌదరి గారు వారిసెక్రటరీ లతో ఎదుర్కొని వచ్చి పెద్దయధికారు లెల్లరను పరిచయముగావించి అనేకులకు జేసి, శ్రీరాజావారు పూలమాలలు వేసిరి, వరంగల్ సుబేదారుగారు అవ్వల్ తాలూకుదారుగారు సదర్ మొహతెమీం తాలీమాత్ గారు జంగ్లాతుసాజంగారు, జిల్లామొహతెమీం పోలీసుగారు, టౌన్‌ప్లానింగు ఆఫీసరు ఫయాజుద్దీన్ గారు, కోర్టుఇంజనీరుగారు, తూర్పుగోదావరి జిల్లాకలెక్టర్ సత్యనాథన్ గారు, భద్రాచలం సబ్ కలెక్టర్ గారు, డిప్యూటీ సూపరింటెంటుగారు, భద్రాచలం రిసీవరుగారు, సింగరేణి, కొత్తగూడెం కాలరీసుకుచెందిన మిస్టర్ ఫిన్ల, డాక్టరు కర్నల్ విటుల్ గార్లు. లేడీక్రాఫ్టన్ గారు మున్నగువారెందరెందరో ఉన్నతాధికారులును, యిల్లెందు, పాల్వంచతాలూకా సంస్థానోద్యోగస్థులును, సంస్థానములోని వతిన్ దార్లు, పటేలుపట్వారీలును, షాహుకార్లును చాలమంది విచ్చేసిరి సంస్థానాధీశ్వరులైన శ్రీరాజావిజయ అప్పారావు సవై అశ్వారావుబహద్దరువారు సర్ అక్బరు హైదరీగారికి సన్మానపత్రమును సమర్పించిరి దానిని వారి లీగల అడ్వైజరు వెంకటచలంగారు చదివిరి సర్ అక్బరు హైదరీగారు శ్రీరాజావారి యాహ్వానమునకు సంతసమును వెల్లడించుచు ఎంతోకాలమునుండి ఈ సంస్థానమును, భద్రాచలదేవాలయమును చూడ నభిలాషను కల్గియుంటిమనియు, ఇప్పుడే నూతనభవన నిర్మాణము మూలమున అది సిద్ధించినదనియు, సంస్థానభాగ్యాభివృద్ధికిని, భవన నిర్మాణములకును శ్రద్ధజూపిన యధికారులను మెచ్చుకొనుచు, వారి సేవలను ప్రశంసించి, శ్రీరాజావారికి జయమునుకోరుచు ఉపన్యసించిరి. పిమ్మట భవనముకడకేగి వెండితాళమునుదీసి ప్రవేశోత్సవమును జర్గించివచ్చిరి. ఎల్లరను అల్పాహారములు పానీయములొసంగబడెను. ఈసమయమున నగరభవనప్రవేశోత్సవ ప్రశంసాపద్యములను (సాహిత్య విద్యాప్రవీణ కె, మృత్యుంజయసోమయాజిగారు రచించినవి.) సంస్థానవిద్యాధికారులైన సాహిత్య విశారద శ్రీ, వెం. ల, నా. శర్మగారు చదివిరి, ఇందుకు సర్ అక్బరు హైదరీగారు మిగుల ప్రశంసించిరి పిమ్మటవారు తక్కుంగల యధికారులతో నగరమంతయుతిర్గి ఆయాభవనములను, నర్సరీయును, రైతుల యిండ్లను పరిశీలించి, మధ్యాహ్నం ౧౨-౩౦ గంటలకు భద్రాచలంరోడ్డు క్షేత్రమునకు వెడలిపోయిరి.

ఈ సందర్భమున శ్రీరాజావారు వచ్చిన పట్వారీలకు, రైతులకు చుట్టుప్రక్కల కోయవారు పేదసాదలకు సుమారు వెయ్యిమందికి పిండివంటలతోడ అన్నప్రదానము గావించిరి. సాయంత్రి శ్రీవెంకటేశ్వరస్వామివారికి బ్రాహ్మణ్యం బ్రాహ్మణసంతర్పణ చేయించి యుపన్యాసమునకు వినియోగించిరి.

మధ్యాహ్నం ౩ గంటలకు సర్ అక్బరు హైదరీగారు భద్రాచలం వెడలి దేవస్థానమును, జలాహారీని పరిశీలించి విచ్చేసిరి.

శుక్రవారం ౪౦. ౫౦ నుండి నతేన్ దారులు పటేలు పట్వారీలు శ్రీరాజావారిని దర్శించి వినతిపత్రమును సమర్పించుకొని ఫూలహారములు సమర్పించిరి. తరువాత యీ సంస్థానమునకు వచ్చి ప్రజల కష్టసుఖముల వాలకించుచు తమపూర్వీకుల మర్యాదలను గాపాడగలరని వేడిరి.

౧౦-౫-౫౦ తారీఖున శ్రీరాజావారు సర్ అక్బరు హైదరీగారిని క్షేత్రమువద్ద సందర్శించి, రాష్ట్రములోని గొప్పజాగీరుదారులైన నవాబుసర్ సాలారుజంగు బహద్దర్ వారినటుల తోడ్కొనివచ్చి తమరాజభవనమును కచ్చేరీలను చూపించి సాగనంపిరి,

వినతిపత్రము

ప్రధానమంత్రిగారికి శ్రీరాజాగారుసమర్పించియుండిన వినతిపత్రములో ఈక్రిందిభాగములు గమనించదగినవి: —

పూజ్యమహాశయా!

"మాతాతగారు కీ॥శే॥ శ్రీరాజా పార్థసారథి అప్పారావుబహద్దరుగారు నైజామురాజ్యమునకు వెలుపలనే తనజీవితమునం దెక్కువభాగము గడుపుచు, బ్రిటిషుఇలాకాలో ఎస్టేటువిషయములందు మునిగి, యీసంస్థానమునందు తగినశ్రద్ధ వహించనిసందర్భమున మీరుబాగుగ నెరిగియేయున్నారు. సంస్థానముతరువాత ఆశ్వారావుపేటయందు వారిఏజంట్లునివసించుచుండుటవలన సంస్థానగ్రామములు విడివిడిగానుండుటవలన రైతులకు నధికారులకు చిరపరిచయముకలుగ వీలులేకుండెను. ఉత్తమపరిపాలనకైఅవసరములందు రైతులధికారులకడకేగుటకు అవకాశముకలిగించునుద్దేశముతో బందోబస్తును, సంస్థానమును పన్నికర్షముగా జేయుటయు, తగునధికారస్థానములను నెలకొల్పుటయు మొదలగు ముఖ్యవిషయములు ప్రారంభింపబడినవి. బూర్గంపాడు, పాలవంచగ్రామములందెచ్చట అధికారస్థానము నుంచవలెనోయను సమస్య యొకటి యుండెను. నిర్దేశస్థలపరిశీలనంతరము, నాతో సంపూర్ణముగా నేకీభవించి కోర్టు ఆఫ్ వార్డ్సువారు తుదకు పాలవంచలోనే ప్రస్తుతనిర్ణయమును గావించిరి. నిర్దేశించబడిన ప్రదేశమెత్తుగాను,సంస్థానమునకు మధ్యగాను, చుట్టుప్రక్కలనుండుపల్లెలకుసులభప్రాప్యముగా నున్నది. బూర్గంపాడు లోతట్టుగాక వర్షకాలమునందు ఈప్రదేశము వరదలతోను, మలేరియాజ్వరముతోను అసౌఖ్యకరముగానుండక నివాసయోగ్యముగా నున్నది ఖమ్మముమండి అశ్వారావుపేటకుబోవురోడ్డును ఇల్లెందు పేటనుండి పాలవంచకువేయబడుచున్న నలుబది మైళ్ళపొడవుగలరోడ్డు, దక్షిణముగా నాగ్లపల్లెవరకువేయనున్న మించబడినరోడ్డు, పాలవంచసంస్థానమునకు సులభప్రవేశ్యమగు మధ్యప్రదేశముగాజేయుచున్నది.

"ఆఫీసులకుదగిన వసతిలేనందున ముఖ్యమైన రికార్డులు పాడగుచుండెను వివసించుటకుదగిన యేర్పాటులులేని కారణమున పాలవంచలో నుద్యోగులు పనిచేయ నిష్టపడకుండుటకు గారణమాయెను. టౌనుప్లానింగుఆఫీసరగు మౌల్వీ ఫయాజుద్దీనుగారును, కోర్టుఆఫ్‌వార్డ్సు యింజనీరగు వైద్యాగారు ప్రస్తుతాభివృద్ధికొకస్కీము నుతయారుచేసిరి. ఇందులో రెవిన్యూ,న్యాయశాఖ, పోలీసు,అటవీశాఖకచ్చేరీలకును, సంస్థానముయొక్క ఆఫీసరులకును,పోలీసుజవానులవసతులకును మరియు వైద్యాలయము టప్పాశాఖలకును ఆధునికాకారముతో గృహము లేర్పాటుచేయబడినవి. ఏ.బి.సి తరగతుల యిండ్లకొరకును, పాఠశాలలకును,వ్యాపారమునకును ప్రత్యేక స్థలము లేర్పాటుచేయబడినవి. నీటివసతికిగాను ఏడుబావులుత్రవ్వించు యేర్పాటు చేయబడినవి. అందులో నాలుగుపూర్తిఅయినవి. ఈబావులలోనినీరుపరీక్షానంతరము ఆరోగ్యకరమునిశ్చయింపబడినది. విశాలమును, పార్క్‌వృక్ష శ్రేణులును సమృద్ధిగానున్నవి. ఈపనులకుగాను వెచ్చించిన సొమ్ము ౧,౨౧,౦౮౩-౫-౩ లు. యింతవరకీసంస్థానము ఆదాయమునుండియే భరింపబడినది. రైతులనును,పనివారికిని ఆరోగ్యపద్ధతులను బోధించి యీ క్రొత్తనగరములో గృహములనునిర్మించుకొనుటకు సాధ్యమయినంతసహాయము నొసగబడినది ఈవరకే మంచిప్రారంభము జరిగినది.

ఆధునికావసరముల ననుసరించి రాజ్యాంగ పద్ధతులు నీ ప్రాచీన సంస్థానమున ప్రవేశింప బ్రోత్సహించు రీతులను వీక్షించుటకు, అభివృద్ధి జరుగుచుండుట గావించుటకు మహాశయులగు మీరానందింతురని నమ్ముచున్నాను.

వసతులు, పరిశ్రమ యీరెండు పనులకుగాను విద్యుచ్ఛక్తిని సప్లయిచేయుటకుకూడ నెదురుచూచుచున్నాము.

"పాలవంచలోనియభివృద్ధికేగాక, గోదావరి కావలియొడ్డుననున్న ప్రాచీన భద్రాచలము ఎస్టేటును ఋణమును విడివిముక్తినిజేయు, నా యత్నములలో కోర్టుఆఫ్‌వార్డ్సువారు సాయపడుచున్నారు. దేవస్థానములవలన హిందూదేశమంతయు ప్రఖ్యాతిగాంచిన యీ ప్రాచీనసంస్థానము చిరకాలమునసే మరల నామాధీనమునకురాగలదనియనుచున్నాను, శతాబ్దమునకుపైగా దేవాలయవిధులు యథాప్రకారముగ జరుగుటకు ౨౦ వేలరూపాయలను వార్షికముక్రింద నొసగుచున్న హైదరాబాదురాజవంశమునకును, నా వంశమునకును, ప్రాముఖ్యతగూర్చుచున్న భద్రాచలదేవాలయ దర్శనమును గావించుకొనుటకు మహాశయులగు మీరుద్దేశించుకొనుట నాకుచాలసంతోషకారణమైనది"

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర మాఘ బ॥ ౯

గురువారము

## సంస్థానాధీశులకు ప్రధాని హెచ్చరిక

మన రాష్ట్రమందు జాగీర్దారులును, సంస్థానాధీశులును తమతమ జాగీరులును, సంస్థానములును తమ భోగ్యములని మాత్రమే తలచుచు, జాగీరులందలి ప్రజలయొక్కయు, సంస్థానములయందలి ప్రజలయొక్కయు క్షేమావసరముల విషయములో తమకు బాధ్యతలనునవి లేవని భావించుచున్న కాలములో, పాల్వంచసంస్థానముయొక్కయు తన రాజధానీనగర ప్రవేశోత్సవసందర్భమున పాల్వంచరాజాగారు సమర్పించిన సన్మాన పత్రమును అవకాశముగాగొని ప్రధానమంత్రి వరేణ్యుడగు రైట్ ఆనరబిల్ సర్ అక్బర్ హైదరిగారు జాగీర్దారులకును, సంస్థానాధీశులకును వారి బాధ్యతలను గురించి హెచ్చరించుట సంతోషకరమైన విషయము.

> "ప్రతిసంస్థానాధీశుడును తనరైతుల క్షేమమును గురించి సరిగాతగినంత శ్రద్ధగలిగి యుండుట విధియైయున్నది."

అని మంత్రివరేణ్యుడు సెలవిచ్చెను, ఇట్టి హెచ్చరికలు చాల అరుదుగాచేయబడుచున్నవి. మనరాష్ట్రములో జాగీరులలోను, సంస్థానాలలోను ప్రజలస్థితి ఎట్లు చాలశోచనీయమైయున్నదో ఇదివరలో సమయమువచ్చినపుడెల్ల, అనేకపర్యాయములు విమర్శగావించియుంటిమి. ఇదేస్థితిలో జాగీరుప్రజలను ఉంచుచో దానివలన తుదకు జాగీరులలోనేగాక చుట్టుప్రక్కలలోను సంక్షోభములు ఉదయించ గలవు. కాబట్టి రాష్ట్రముయొక్క శాంతి రక్షణకొరకైనను ప్రభుత్వమువారు ఈజాగీరుప్రజల స్థితిని కనీసము ఖాల్సాప్రజలస్థితివరకైనను బాగుచేయుటకు జాగరూకులగుట అవసరము. ప్రధానమంత్రిగారు ఇపుడు చేసినటువంటి హెచ్చరికలను తఱచుగా సమయానుకూలముగ ముఖ్యమంత్రులును, పెద్దప్రభుత్వాధికారులును చేయుటవల్ల జాగీర్దారులచిత్తవృత్తులమార్పుద్వారా కొంతప్రయోజనము కలుగవచ్చును. కాని అంతమాత్రముతో సంతృప్తికరమైన ఫలితము కలుగునని ఎవరునమ్మగలరు? జాగీర్దారులకు ప్రజలక్షేమావసరముల సంరక్షణవిషయంలో గల బాధ్యతలు సరిగా ఆచరించబడునట్లు చేయుటకు అవసరమైన శాసనసంబంధములైన ఏర్పాట్లుచేయవలసియుండును. ఉదాహరణార్థము శ్రీయుతకొండా వెంకటరంగారెడ్డిగారు శాసన సభాసభ్యులై యున్నప్పుడు ఆసభయందు ప్రవేశపెట్టుటకై తెలిపియుండిన "జాగీర్లలోని మాల్గుజారీ నిర్ణయశాసనము ఇట్టిదే."

పాల్వంచరాజాగారు ప్రధానామాత్యులవారికి సమర్పించుకొన్న సన్మానపత్రములో తనప్రజలయెడ తనబాధ్యతలను గుర్తించినట్లు

> "ఆధునికావసరములననుసరించి రాజ్యాంగపద్ధతుల నీప్రాచీనసంస్థానమున ప్రవేశింపజేయ ప్రోత్సహించు రీతులను వీక్షించుటకు, అభివృద్ధిజరుగుచుండుట గాంచుటకు మహాశయులగు మీరానందింతురని నమ్ముచున్నాను."

అని చెప్పిరి. ఈవాక్యమందు రాజ్యాంగపద్ధతులనుమాట అర్థము సాధారణంగా రాజ్యాంగసంస్కరణలని వాడుకొను భావమే అయినచో పాల్వంచరాజాగారు తమ సంస్థానప్రజలకు ఉదారమైన వాగ్దానము చేసినారని చెప్పవచ్చును. ఈవాగ్దానము సరిగా అమలుచేయబడునపుడు వాగ్దానకర్తయొక్క హృదయము విశదముకాగలదు. అందుకు ఎటువంటి ఆటంకములుగాని రాకుండుగాక!

## రాంగోపాల్ మిల్లులో సమ్మె

### లాఠీఛార్జినిగురించి శ్రీ మం. రామచంద్రరావుగారి ప్రకటన

హైదరాబాదు (దక్కన్) ఫిబ్రవరి ౧౭

ఇక్కడ దివాన్ బహదర్ రాంగోపాల్ మిల్లులో సుమారు ౨౦౦౦ మంది కూలీలు ౧౯౩౯లో తగ్గించియుండిన తమకూలీల మొత్తములను పూర్వస్థితికి తేవలెననికోరి తమకోరిక తీర్చుకొనుటకై ఫిబ్రవరి ౧౫వ తారీఖునుండి సమ్మెకట్టిరి. సంఘర్షణజరిగేటట్లుండుటచే భయపడి పోలీసులు మిల్లువద్దికి పిలిపించబడిరి. మిల్లువద్ద పోలీసులు కావలా కాయుచుండిరి.

రాంగోపాల్ మిల్లుఅధికారులు గావించిన ప్రకటనలో ఇట్లు తెలిపినారు:—

"మిల్లులో పని ౧౯౪౪ ఫిబ్రవరి ౧౫వ తేది ఉదయము ౭ గంటలకు ప్రారంభమయ్యెను ఒక గంటతర్వాత పనివారలు ఆకస్మికంగా సమ్మెకట్టి తెచిపోవుచు ౧౯౩౯వ సంవత్సరంలో తమజీతాలల్లో ప్రతిశతి ౧౦ శాతమును తగ్గించినదాన్ని తిరిగి యిచ్చేవరకు పనిలోచేరము లేదనిరి. రాయెబహదర్ సేటు శ్రీకిషన్ జీ శుకదేవ, యస్. వి. నాయక్, గోపాల్ కిషన్ మురళీధర్ గారలు వెంటనే ఆక్కడికిపోయిరి. ఆవెంటనే యన్. బి. చీవాయ్ గారును, పొద్దుటూరి వీరన్నగారును మొదలైన సీనియర్ నాయబ్ కొత్వాల్, నాయబ్ కొత్వాల్ యూనుస్ మీర్జాగారలును, పోలీసు సదర్ అమీనున్ను మిల్లువద్దకువచ్చిరి.

ఉదయం ౯, మరియు ౧౧ గంటలమధ్యన శ్రీధర్ నాయక్ గారు పనివారలను పనులలోచేరవలెననియు, వారలకోరికలవిషయంలో తాము ఆలోచించగలమనియు విన్నవించుచు ఉపన్యాసములిచ్చిరి. కాని పనివారలనాయకులు వెంటనే తమకోతలను తొలగించినగాని తాముపనులలో చేరమనిరి.

౧౧-౪౫ గంటలవేళ యన్. బి. చెనాయిగారు మిల్లునుండి పోబోగా ౪౦౦ మొగలు ౫౦౦ మంది కూలివాండ్రు రోడ్డుకడ్డంగాపండుకొని వారి మోటారుకారు నడ్డగించిరి. అందుచేచెనాయ్ గారు తిరిగిఆఫీసులోనికిపోయిరి. మిల్లులోకిపోవుటకును వచ్చుటకును ఒక్కటేమార్గము. దానికిఅడ్డంగాకూలివారలు చేరిరి. ఈవిధంగాకూలివారలు ఎంతచెప్పినా పనులలోకిపోనందువల్ల ఆకంపెనీయొక్క డైరక్టులసమితివారు ఫిబ్రవరి ౧౭వతేదినుండి తిరిగికూలివారలలో ప్రతిశతి ౭౦ మందియైనా చేరేటంతవరకు మిల్లుమూయబడి యుంచగలదనియు, ఇట్లుమూసియుంచినకాలంలో కూలీలజీతములీయబడవనియు నిర్ణయించి దానిని తెలిపే నోటీసును నోటీసులబోర్డుపై అంటింపజేసిరి.

కూలివాండ్రను పనులలోకిపంపించుటను శ్రీధర్ నాయకుగారు తుదిసారిచేసిన ప్రయత్నముకూడ నిష్ప్రయోజనమగుటచే, మిల్లుఅధికారులు మిల్లుమార్గమునుండి పనివారలనుతొలగించుటకు పోలీసులనుపిలిపించిరి. పోలీసులు ఒకలారీలో మిల్లులోకి పోవయత్నించుచుండగా కూలివారలలో కొందరుస్త్రీలు ద్వారంవద్దఅడ్డంగా పండుకొనిరి అదివరకే మిల్లులోనుండినపోలీసులు ఆస్త్రీలను తేవనెత్తి ప్రక్కకుతొలగించిరి. అప్పుడు పోలీసులపై రాళ్ళు దుమ్ముపోయుటచే కొందరు పోలీసుఅధికార్లకును కానిస్టేబిళ్లకును చిన్నదెబ్బలు తగిలెను. కొందరు కూలివారలకుగూడ చిన్నదెబ్బలైనవి.

### శ్రీ మం. రామచంద్రరావుగారి ప్రకటన

నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభాధ్యక్షులగు శ్రీయుత మందుముల రామచంద్రరావుగారిట్లు ఒకప్రకటన గావించినారు.

తెలిపినపిదప మావిధిఏమియని శాంతముగ ఆలోచించితిమి. గిర్నీలోపలికివెళ్లి పరిస్థితులను చూచి తెలిసికొనుటయే మావిధియని నిర్ణయించుకొని గిర్నీ ఆవరణలోనికి ప్రవేశించితిమి.

నేను ౧౭వ ఫిబ్రవరి ౧౯౪౪౦ సంభవించినదుర్ఘటనలను వ్యక్తపరచుట నావిధియని ఎంచుచున్నాను. నేనును, రైతుపత్రికా సంపాదకులగు శ్రీయుత మందుముల నర్సింగరావుగారు, శ్రీ హరిశ్చంద్ర హెడాగారును కలిసికారులో హుసేన్ సాగరుకట్టమీదుగ బేగంపేటలోనున్న పారిశ్రామిక కార్యాలయము (సనత్ వహిర్ఫత్) నకు వెళ్ళుచుంటిమి. చెరువుకట్టచివరన జనముగుమిగూడియుండినదీ, కొందరుఇటూఆటూ పరుగెత్తుచుండినదీ, పోలీసుసిపాయీలు కట్టచివరనుండి సికింద్రాబాదు వైపును సీటీలుఊదుచు పరుగెత్తుచుండినదృశ్యము మాకుఅగుపడెను. ఈహడావిడిచూచి సంగతి ఏమోకనుగొనుటకు ఆగితిమి కాలువపక్కనుండి కొందరు స్త్రీలు, పురుషులుతమకు తలె హైద్రాబాదు వైపును పరుగెత్తుచుండిరి. వీరితో మేమువిచారించితే "మేముగిర్నీలోపనిచేయుకూలీలము, మాపైపోలీసువారు లాఠీదెబ్బలు ప్రయోగించుచున్నారని" తెలిపిరి. ఈసంగతి

ఆ ఆవరణలోమధ్యనున్న ముఖ్యభవనము ఎదుటనగ పోలీసు మోటారులారియుండెను. వీరితో పోలీసుసిపాయీలుండిరి. జనాబుయూనుసుమిర్జా మదద్గారుకొత్వాలు గారున్ను మోటరులారీసమీపమునఅగుపడిరి. మమ్ములమాటలతో మావద్దికికొందరుకూలివారువచ్చి సంగతులు తెలుపుచుండగ, వెంటనే మదద్గారుసాహెబున్ను, వర్దీతొడగని యింకెవ్వరోఒకవ్యక్తి. ఇంక కొందరు పోలీసుసిపాయీలు మమ్ములనుసమీపించిరి. మదద్గారుసాహెబుతో మాటలుచ్చటలు జరుగుచుండగ వర్దీతొడగనివ్యక్తి శ్రీనర్సింగరావుగారితో "మీరున్నదయచేసితిరా? ఎందుకువస్తిరి? మొదలుచిమ్మిఅంటించి తరువాతతమాషాచూచుటకువస్తారు" యనిచాలాపరుషధ్వనిలో మాట్లాడఆరంభించిరి. పత్రికాకారచయితనైనందున యథార్థస్థితులు కనుగొనుట తమ విధియని శ్రీనర్సింగరావుగారు తెలిపిరి. దీనిపైనఆవ్యక్తి ధోరణిమితిమీఱిపోయెను. ఇదిమర్యాదగ ప్రవర్తించవలసినపద్ధతికాదని శ్రీనర్సింగరావుగారు ఆవ్యక్తిని హెచ్చరించగా, ఆవ్యక్తియొక్క ముఖచిహ్నములు, వైఖరిమరింతమారి తమఆగ్రహమును ఆపుకొజాలనస్థితివచ్చి శ్రీనర్సింగరావుగారికి, మాకు ఏమిచేయవలెననియో సంసిద్ధులైరి ఈపరిస్థితిని మదద్గారుసాహెబుగారు గ్రహించికాబోలును ఆవర్దీలేనివ్యక్తిని శాంతిపరచిదూరముచేసిరి. అచట మావద్దనున్నకూలీలు తమసంగతులు తెలుపుకొనుటకు సాహసించక వెళ్లిపోయిరి.

ఈమధ్యాహ్నఈచిత్రకథజరిగినందున గిర్నీలో కార్మికులపైనజరిగిన ఈలాఠీచార్జిపరిస్థితులయొక్క యథార్థముమాకు తెలియనందునకు విచారపడుచున్నాను కానిదీనివల్ల ఈరోజునకొంత గుణపాఠము మాత్రము గలిగినదనిఎంచుచున్నాను. చాలా నెమ్మదిగా. శాంతముగా, ప్రజాసమస్యలను ఆలోచించుచుఎల్లప్పుడు ప్రభుత్వఉన్నతాధికారులవద్ద వినయవిధేయతలతో మొరలుపెట్టుకొనుచు, ఉన్నతాధికారులవద్ద కొంతపేరుప్రతిష్ఠలు గౌరవములు గలిగియున్న శ్రీనర్సింగరావుగారి వంటివారితో హైద్రాబాదకేంద్రమందు పాలకవర్గాధికారులు ముఖ్యముగా పోలీసుశాఖ ఉద్యోగులు ఈవిధమైన ప్రవర్తనచూపడముచూచినజిల్లాలలో తాలూకాలలో ఏవిధముగ ఈఅధికారుల ప్రవర్తనయుండునదో వేరుగా చెప్పవలయునా?

... ... ... ... ...

ఈవైఖరిని ఈయుగస్వేచ్ఛాశతాబ్దమున ఎవ్వరును సహించజాలరు. ప్రభుత్వదృక్పథమే ఈవిధముగ నున్నదని నేనుఅనుటలేదు. కాని ప్రభుత్వముతో నాకు ఒకఫిర్యాదుమాత్రమున్నది. అది మనుగుపెట్టక చెప్పదలచినాను అధికారుల దుష్ప్రవర్తనములను, అరికట్టుటకు ఫలప్రదమైన విధానమును ప్రభుత్వము అవలంబించుటలేదు. ...... ...

... ... ... ... ... ... ...

ఈనాడుజరిగిన లాఠీఛార్జి పరిస్థితులను స్వతంత్రవిచారణసంఘమును నిర్ణయించి విచారించగలరాయని చాలానిరాశతో ఆశించుచున్నాను.

## హైదరాబాదు రక్షణ నియమావళి

### హర్కారే మురాఫాలో తీర్పు

హైదరాబాదు (దక్కన్), ఫిబ్రవరి ౧౫

హైదరాబాదు రక్షణ నియమావళిక్రింద అరెస్టుచేయబడి శిక్షవిధించబడి శిక్షననుభవించుచుండిన యన్. యస్. హర్కారే (నాగపూరువారు) గారు హైకోర్టున్యాయమూర్తులగు అబుసయ్యద్ మీర్జా, ఆర్. యస్. నాయక్ గారలవద్ద మురాఫాచేసియుండిరి.

హర్కారేగారివకీలు వాదించుచు హర్కారేగారు మరాఠీభాషలో ఉపన్యసించియుండిరనియు, పోలీసుపక్షపుసాక్షులుకూడ ఆభాషకవముగానుండెనని ఒప్పుకొనిరనియు, ఆఉపన్యాసాన్ని ఉర్దూ షార్టుహాండు సంకేతాలలో వ్రాసికొనినట్టి నరసింగరావుఅను పోలీసు రిపోర్టరుకు ఆఉపన్యాసముయొక్క పూర్తిభావమును తెలుపుటకుగాని ఆఉపన్యాసమును అర్థముచేసికొనుటకుగాని చాలినంత మరాఠీభాషాజ్ఞానములేదనియు అసలు మరాఠీఉపన్యాసముయొక్క ప్రతి హైకోర్టువారిసన్నిధిలోలేదనియు, దాని తర్జుమానుబట్టి మూలముయొక్క సరియైన భావము గ్రహించుట కష్టమనియు చెప్పిరి. ప్రభుత్వ న్యాయవాదియగు ముర్తుజాఖాన్ గారు క్రిందికోర్టువారితీర్పు సరియైనదేయనియు, దానినిమార్చుటకు కారణమేదియు చూపబడలేదనియు వాదించిరి.

న్యాయమూర్తులుతీర్పునిచ్చుచు నరసింగరావుకు గొప్ప మరాఠీభాషాజ్ఞానము లేకపోవచ్చునుగాని, హర్కారే ఉపన్యాసములోని అభిప్రాయమును సరిగాకనుగొని చెప్పగలిగినంత పోలీసుపని అనుభవమైతేఉన్నదనిరి. అందువల్ల నరసింగరావు రిపోర్టుతెలిపినట్టి హర్కారే ఉపన్యాసభావము సరిగానేఉండెనని చెప్పిరి. ఈవిషయంలో క్రింది న్యాయస్థానంలో తీర్పుతో తమకుభిన్నాభిప్రాయము లేదనిరి. కాని హర్కారేగారు తనకు విధించబడిన శిక్షలో ౫ నెలలు అప్పుడే అనుభవించినారు, అదిచాలదనియు, ఇకవారిని వదలవచ్చుననియు చెప్పిరి.

ఈ తీర్పుప్రకారము హర్కారేగారు ఫిబ్రవరి ౧౫వతేది రాత్రి ౭ గంటలవేళ సెంట్రల్ జెయిలు నుండి విడుదలచేయబడిరి.

### విచారణలో ఖైదీమరణము

ఉస్మానాబాదుజిల్లాలో తిరులో కొట్లాటలసందర్భమున పట్టుకొనబడి, విచారణచేయబడుచున్న ౧౯మందిలో మాధవ్పుఅనునతడు ఉస్మానాబాదు జెయిలులో మరణించినట్లు వార్త వచ్చినది. అతనివయస్సు ౫౬ ఏండ్లు.

—(హైదరాబాదుబులెటిన్)

## కోర్టుధిక్కారపు నేరము

### నిందితుడు పశ్చాత్తాపము తెలుపుట

హైదరాబాదు (దక్కన్) ఫిబ్రవరి ౧౩

హిందూ ప్రజామండలికిచెందిన వై.డి.జోషి మున్నగు అయిదుగురు పోయినహోలీ సందర్భంలో బీదరుఅల్లరులనుగురించిన ఒకయభియోగము న్యాయస్థానములో విచారణయందున్న సమయంలో బీదరుకుపోయిచూచివచ్చి గావించినఒక ప్రకటనవల్ల ఆబీదరుఅల్లరులసంబంధమైన ఆభియోగమందు న్యాయనిర్ణయమునకు విఘాతము కలుగునని కోర్టుధిక్కారనేరమును ఆయిదుగురిపైమోపియుండిరిగదా. ఆనేరము విచారణలో ఉభయపక్షాల వకీళ్ళవాదములు ఫిబ్రవరి ౧౧వతేది ముగిసిన తర్వాత నిందితుల వకీలగు బి. రామకృష్ణారావుగారు బీదరుఅల్లరులనుగూర్చి చేయబడినప్రకటనలో వెల్లడించిన అభిప్రాయాలకు నారాయణరావు జోషి, పటేలు, గోరె గారలపక్షమున పశ్చాత్తాపమును తెలుపుచు క్షమాపణకోరు వాఙ్మూలమును న్యాయస్థానంవారికి సమర్పించిరి ఇంకనుతీర్పుకాలేదు.

## తుర్కీ—బల్గేరియాలకు ఒడంబడిక

మొన్న మొన్నటివరకు తుర్కీలోపత్రికలు జర్మనుసేనలను బల్గేరియాగుండాగ్రీసుపైకి పోనిచ్చుచో తుర్కీఊరకుండజాలదని బెదరించుచుండ నిజమేననిఅనుకొనుచుండిరి. కాని ఇపుడదేమివిచిత్రమో ఆరెండుదేశాల ప్రభుత్వాలును ఒకవిదేశంపైకి ఒకరుకొకరుదండయాత్ర వెడలకుండునట్లును, మైత్రిగలిగి ఆమైత్రిని పోషించుకొనుచుండునట్లును, ఒకదేశముతోఒకదేశము వ్యాపారమును సాధ్యమైనంతవృద్ధిచేసుకొనునట్లును, ఉభయులఈమైత్రికి విరుద్ధమైనంతవ్రాతలు ఉభయుల దేశాలలోనిపత్రికలు వ్రాయకుండునట్లును ఒడంబడిక గావించుకొనినవి. ఈసంగతి ఫిబ్రవరి ౧౮ వతేదిబయలుపెట్టబడినది. జర్మనీఇప్పుడు బల్గేరియాగుండా సేనలనుపంపించుచో తుర్కీ బల్గేరియాతో వైరముపెట్టుకొనవని ఈఒడంబడిక స్పష్టమైనది. జర్మనీవిరోధకూటమికిచేరిన తుర్కీబల్గేరియాలను పూర్తిగాఒడంబడికచేసి మరిరేట్లు ప్రేరేపించునో ననుమానించకలుగగలదు అయినదేదైనవల్ల తుర్కీయింతవరకే ప్రకటనచేసినను దేశాలతోగాని మరొకని ఉన్న ఒడంబడికలను ఏ విధంగాను గాని కలుగజాలదని స్పష్టముచేయబడినది.

# బల్గేరియాపై జర్మనీదాడి సన్నాహాలు

## సరిహద్దులలో జర్మనుసేనలు చేర్చబడుట

జర్మనులు త్వరలో నేబల్గేరియాపై దాడిజరుప బోతున్నారని బల్గేరియాలోని రాజకీయవర్గాల వారు అభిప్రాయపడుచున్నారు. బల్గేరియావిమానా[శ]యాలలో అనేకములు నాజీఉద్యోగులఅధికారంలోఉన్నవి. ఫిబ్రవరి మొదటివారంలో వేలకొలదిజర్మను సేనలు సామాన్యపౌరుల దుస్తులతో బల్గేరియాలోనికి ప్రవేశించినట్లు తెలుస్తున్నది. డాన్యూబునదీమీదుగా కొన్నిటాంకులు కూడా తీసుకరాబడినట్లు తెలుస్తున్నది మధ్య డాన్యూబుభాగంలో జలాఘాటుకున్న టుర్నూసెవెరిన్ కున్నవడుమ జర్మనులు మోటారుపడవల ను కేంద్రీకరిస్తున్నారు. బల్గేరియాదుమేనియా, యుగోస్లావియాసరిహద్దులు కలిసేచోటవున్న పట్టణముగువిడిన్ కుఎదురుగా ఈసేనలు నిలుపబడినవి కానిబల్గేరియాకు జర్మనుసేనలు, విమానాలుచేరినట్లు ప్రకటితమైనవార్తలునిజంకాదని బల్గేరియా అధికారులనుచున్నారు.

బాల్కనులరక్షణకు బాల్కనురాజ్యాలన్నీ కలిసి ఒడంబడికచేసుకోవటయేమంచిదనితుర్కీఅభిప్రాయము చర్చిల్ కూడా ఇట్టినూచనచేసినందుకు ఇచ్చటివారు సంతసిస్తున్నారు. ౩౦ యుగోస్లావుడివిజనులు ౫౦ తుర్కీడివిజనులు, బల్గేరియాసేనలు, బ్రిటిషుయుద్ధనౌకలు, విమానాలూ ఎదురుగాఉన్నప్పుడు జర్మనీతోసుకోనిరాలేదనిఅంటున్నారు.

అయితేబల్గేరియాలోనికి మార్గంకోరుచున్నదని అదిఅంతేకాక బెలనుమద్దత్తుతోఏర్పడే బాల్కనురక్షణసంధికి జర్మనీప్రతిఘటనకేకాక, రష్యాప్రతిఘటనకును అవకాశంఉన్నట్లు తుర్కీలోతలచుచున్నారు. అయితే యుగోస్లావియాకూడ గాని జర్మనీదురాక్రమణజరిపితే రష్యావాటికి సహాయంరాదేసూచనలులేవు.

బల్గేరియాలోని గ్రీసుస్త్రీశిశువులుగ్రీసుకువమరలివడం మంచిదని బల్గేరియాలోని గ్రీకురాయబారి హెచ్చరిక చేసినాడట.

బాల్కను రాష్ట్రాలలో జర్మనులు బలీయమైన సైనికప్రదర్శనాలను జరుపుచున్నట్లు ఇప్పుడు స్పష్టమగుచున్నది. రుమేనియాఅంతటను జర్మనులుతీవ్రసైనిక చర్యలను సాగించుచున్నారట

బుఖారెస్టులోవున్న బ్రిటిషురాయబారి తాను తనదేశానికి తేచిపోయెదననినాడు

లండనులోవున్న రుమేనియా రాయబారవర్గాన్ని రుమేనియా ప్రభుత్వంకూడా స్వదేశానికి గమ్మన్నది.

జర్మనుప్రభుత్వం ఆహ్వానించుటవల్ల యుగోస్లావు ప్రధానమంత్రి విదేశాంగమంత్రి ప్రత్యేక విమానంమీద జర్మనీకి ఫిబ్రవరి ౧౩ వతేదీఇయలుదేరిరి.

యుగోస్లావునాయకులు జర్మనీలో రెండు రోజులుండి హిట్లరునుదర్శించి జర్మనుప్రముఖులతో సంభాషింతురు.

---

# గాంధిమహాత్ముని ఆజ్ఞ

## మదరాసు కార్పొరేషను కాంగ్రెసు సభ్యుల రాజీనామాలు

మద్రాసు ఫిబ్రవరి౧౫.

ఈమధ్య మదరాసుకుపోయిన ఆచార్య కృపలానిగారిద్వారా మదరాసు కార్పొరేషనులోని కాంగ్రెస్ మునిసిపల్ పార్టీకి గాంధిమహాత్ముడొక ఉత్తరువు పంపించియుండెను. దానిని అనుసరించి కాంగ్రెసుమునిసిపల్ పార్టీవారు తమపదవులన్నీ రద్దుచేసుకొనినారు. కాంగ్రెసుపార్టీ నాయకుడు డాక్టరు యు. కృష్ణరావుగారు ఫిబ్రవరి౧౩వ తేది సాయంత్రము ౪గంటలకు మేయరుఆఫీసుకు వచ్చి తనుతోసహా తొమ్మిదిమంది కాంగ్రెసు సభ్యులరాజీనామాలు అందజేసిరి. ఆసమయంలో మేయరు ఆఫీసులో లేరు.

కార్పొరేషన్ అకౌంట్సుకమిటీ అధ్యక్షుడగు మన్. రాజగోపాలన్, వి. పార్థసారథినాయకర్, ఏ ఆర్ ఏ రాజగోపాలనాయుడు, వి సుబ్రహ్మణ్యంచెట్టి (డిప్యూటీమేయరు), ఎస్. పార్థసారథిగారలు రాజీనామా ఇవ్వరని అనుకొనుచున్నారు.

సత్యాగ్రహోద్యమంలో పాల్గొని జైలుశిక్షనుభవించుచున్న ఎస్ సత్యమూర్తి, కె వెంకటస్వామినాయుడు, గద్దె రంగయ్యనాయుడు, పి. ఎం. ఆదికేశవులునాయకర్, రుక్మిణీ లక్ష్మీపతి గార్ల రాజీనామాలేఖలు జైలులు సూపరింటెండెంటుద్వారా అందజేయవలసి ఉండును. వీనకాటిని దాఖలుచేయుటకు కొన్నిరోజులు ఆలస్యమగును జనవరినెల మొదటిరోజులలో మద్రాసు కార్పొరేషను వారు గవర్నరుయుద్ధనిధికి ౧౦౦౦౦ రూపాయిల విరాళమునిచ్చిరను సంగతి లోకవిదితము. కాంగ్రెసుసభ్యుల రాజీనామాకు ఇదే కారణము.

---

# గ్వాలియరు మహారాజు మొహరంలో పాల్గొనుట

గ్వాలియరులో మొహరంపండుగ ఆఖరురోజున (ఫిబ్రవరి ౭వతేది) పీర్లను కర్బలాలో ముంచబోయినపుడు ఊరేగింపులో అసంస్థానపు మహారాజా గారును, సంస్థానాధికారుల సేకులను, సంస్థానపుకాల్బలముతోను, అశ్వికదళముతోను పాల్గొనిరి ఫిబ్రవరి ౭ వతేదిరాత్రి సంస్థానపుపీరును పట్టణమంతటను ఊరేగించినపుడుకూడ మహారాజాగారును, సంస్థానాధికారులును పాల్గొనిరి.

---

# కాంగ్రెసుసత్యాగ్రహము

### అరెస్టు గావింపకపోవుట

మదరాసు రాష్ట్రంలో తెనాలితాలూకా యడ్లపల్లిగ్రామంలో ౧౫-౨-౪౧వ తేదిన శ్రీ ఆలపాటి నాగభూషణంగారును, శ్రీ ముసునూరి బాలకృష్ణారావుగారు చిలుమూరు గ్రామంలోను, శ్రీ ఎలమంచిలి వెంకటరామయ్యగారు మోపర్రు గ్రామంలోను, శ్రీ రావి వెంకటేశ్వర్లుగారు తెనాలిలోను, శ్రీ దివి రాధాకృష్ణమూర్తిగారు పెద్దపులివర్రు గ్రామంలో యుద్ధవ్యతిరేక వాక్యములు పల్కుచు సత్యాగ్రహము గావించిరి. పోలీసువారు పైసత్యాగ్రహుల నెవ్వరిని అరెస్టుగావింపలేదు.

### జుర్మానా వసూలు నిమిత్తం ఆస్తి జప్తు

తెనాలితాలూకా రావికంపాడు గ్రామంలో సత్యాగ్రహము గావించిన వెన్నంకోటయ్యగారికి రూ ౧౦౦ జుర్మానా విధింపబడెను. ఆ జుర్మానా వసూలునిమిత్తం కొల్లూరుపోలీసువారు రావికంపాడు గ్రామమునకు వెళ్లి శ్రీ వెన్నంకోటయ్యగారియింటిలోనున్న నాలుగుకుర్చీలు, పళ్ళెము, చెంబులు, ధరిచులాగులు, చొక్కాలు, కోవతులు, చీరెలు, తప్పుడుబియ్యము, మినుములు, గొడవళ్ళు, మోకులు, దూది ఏకుబద్దలు, దేశీయనాయకుల పటములు, పడుకు నేసుక్కుమంచములు, పాతగుడ్డలు, సీటలు, తుంగచాపలు మున్నగుసామానులు జప్తుచేసి గ్రామ మునసబుగారికి స్వాధీనపరచిరి.

### అరెస్టు కాలేదు

చెరుకుపల్లి కావూరు గ్రామంలో ఫిబ్రవరి ౧౫వ తేది ఉదయము ౧౧గంటలకు భారతసేవకమండలి గ్రంథాలయమునందు బజారులో కావూరు వెంకటరత్నముగారు సత్యాగ్రహముచేసిరి. పోలీసువారు వారిని అరెస్టుచేయలేదు.

### పూర్వపు మునిసిపల్ చేర్మెను సత్యాగ్రహము

హిందూపురం. పూర్వపుమునిసిపల్ చేర్మెన్, ప్రస్తుతము మునిసిపల్ కౌన్సిలర్ ను, కాంగ్రెసుసభ్యులునగు శ్రీయం. యన్. అశ్వత్థనారాయణయ్యశెట్టిగారు ౩-౨-౪౧వ తేది సా॥ ౫గంటలకు హిందూపురము లక్ష్మిటాకీస్ ఎదుట మైదానమందు సుమారు రెండువేలమంది ప్రజలయెదుట యుద్ధవ్యతిరేకపు కేకలువేసి సత్యాగ్రహముచేసి, అరెస్టు అయిరి. వారికి ౧ సంవత్సరం కఠినశిక్షయు, వెయ్యి రూపాయల జుర్మానాయు, జుర్మానా చెల్లింపనియెడల మరి రెండునెలలశిక్షయు విధించబడెను.

### నేరము మోపలేదు

అనంతపురంజిల్లాబోర్డుపబ్లిక్ వర్క్సు కమిటీ మెంబరును, కాంగ్రెసుసభ్యుడును అగు శ్రీ వి. ఆదినారాయణరెడ్డిగారు, ౧-౨-౪౧ తేదీ పెనుగొండతాలూకాలో చర్ల గ్రామమున యుద్ధవ్యతిరేకపు సత్యాగ్రహము చేసినవెంటనే అరెస్టుచేయబడి, అయూరిసబ్ జైలునందు ౯వ తేదివరకు రిమాండు నందుంచబడి, ౯వ తేదిపగలు ౯గంటలకు జాయింటు మేజిస్ట్రేటుగారి యెదుట పెట్టబడిరి. రెడ్డిగారిపై ఛార్జి పెట్టనందున, జాయింటు మేజిస్ట్రేటుగారు విడుదలచేసిరి.

### అరెస్టులు లేవు

బళ్లారిజిల్లా ఆలూరుతాలూకా నేమకల్లులో ఫిబ్రవరి ౪వ తేది సాయంత్రము ౫.గంటలకు శ్రీ యల్. సీతారామరెడ్డిగారు సత్యాగ్రహముచేసిరి. పోలీసువారుఅరెస్టుచేయలేదు. తమపరికొలెనడకతో గ్రామమునకు ౫ మైళ్ళదూరములో నున్న చిప్పగిరియను పోలీసుస్టేషను యుందు గ్రామమునకువెళ్ళి, ౫వ తారీకున అరెస్టుకొని రామశర్మతో కూడి సత్యాగ్రహముచేసిరి. ౬వ తారీఖు గ్రామమునకు ౧౧ మైళ్ళదూరములో అనంతపురంజిల్లాకు చెందిన తిమ్మనచెర్ల గ్రామములో రామశర్మయు, రెడ్డిగారును సత్యాగ్రహము చేసిరి. అక్కడిపోలీసుసబ్ యిన్స్పెక్టరువారి అడ్రసులు వ్రాసికొనివిడిచిపెట్టిరి.

అనంతపురంజిల్లాలో ౩-౨-౪౧ తేది చిట్టూరులో సత్యాగ్రహమొనర్చిన శ్రీ వెంకటరెడ్డిగారిని ౯వ తేది విడుదలచేసిరి ౫-౨-౪౧ తేది నరసాపురంలో సత్యాగ్రహమొనర్చిన జాటూరు చౌడప్పగారిని, ౬-౨-౪౧ తేది జంబులదిన్నె గ్రామములో సత్యాగ్రహమొనర్చిన బోయ ముత్యాలు అనువారిని, అదేవిధము ఉరవకొండలో సత్యాగ్రహమొనర్చిన జాటూరు రామలింగయ్యగారిని అరెస్టుచేయలేదు. ౭వ తేది ముష్టూరు గ్రామములో సత్యాగ్రహమొనర్చిన డి. కుమారస్వామి అనుయువకునిగూడ ౯వ తేది ఉదయము వరకు అరెస్టుచేయలేదు. తిమ్మనచెర్లలో సత్యాగ్రహమొనర్చిన బళ్లారిజిల్లాసత్యాగ్రహులు ఒకరిద్దరుగూడ అరెస్టుచేయక వదలివేయబడిరి.

### అక్రమముగా వసూలు చేసిన జుర్మానాల గతి

ఫిబ్రవరి ౯వ తేదిన గాంధిమహాత్ముని చూచిన పిదప శ్రీకృష్ణదత్తపలివాలుగారు ఆగ్రాకును, శ్రీరఘునందనగారు ఢిల్లీకిని వెడలిపోయిరి. తగిన కారణములు లేకుండ జుర్మానాలు వసూలు చేయు చో కోర్టులలో దావావేయుటకు మహాత్ము డనుమతించెనని పలివాలుగారు చెప్పినారు.

సంయుక్తరాష్ట్రసత్యాగ్రహుల పట్టికను పరిశీలించి, తగినయోగ్యతలుకలవారిని సత్యాగ్రహము చేయనిచ్చుటకు మహాత్ముడు తన కధికారమొసంగెనని కూడ శ్రీకృష్ణ పలివాలుగారు చెప్పిరి.

లక్నో మునిసిపలు కమిషనరు, సంయుక్తరాష్ట్రపు కాంగ్రెసుకమిటీసభ్యుడునగు లాలానతూరాంరస్తోగీగారును లక్నో నగరకాంగ్రెసు కమిటీ కార్యదర్శి శ్రీ భాస్కరనారాయణ మకానీగారును ఫిబ్రవరి ౯వ తేదిన అరెస్టుచేయబడిరి.

పంజాబురాష్ట్రంలో అహార్కలీకాంగ్రెసు కమిటీ కార్యదర్శి శ్రీ పురాణచందుగారు జనవరి ౯వ తేది సాయంకాలము అరెస్టు చేయబడిరి.

బెంగాలురాష్ట్రంలో హుగ్లీకాంగ్రెసు ప్రచారకుడగు శ్రీ సుధీరచంద్రలాహిగారు ఫిబ్రవరి ౯వ తేదిన సాంపూరులో సత్యాగ్రహముగావించిరి. కాని ఆయనను అరెస్టు చేయలేదు.

### జిల్లా కాంగ్రెసు కార్యదర్శి అరెస్టు

డేరాడూనుజిల్లా కాంగ్రెసుకార్యదర్శి శ్రీ గోవిందరామ్‌భట్ (బార్.అట్.లా)గారికి ఫిబ్రవరి౧౧వ తేది ౬నెలలకఠినశిక్ష, రూ౫౦౦ జుర్మానా దానిని చెల్లించనియెడల మరి ౬నెలల శిక్ష విధింపబడెను.

### అల్మోరాజిల్లా కాంగ్రెసుకమిటీ నియంత

మహాత్మాగాంధిగారి ఆదేశంఅనుసరించి శ్రీ సతీష్‌చంద్రపంత్ గారు అల్మోరాజిల్లా కాంగ్రెసుకమిటీ నియంతగా నియమింపబడిరి.

### జెయిలులో పండిత గోవిందవల్లభ పంతుగారి దినచర్య

జెయిలులో మాజీప్రధాని పండితగోవిందవల్లభపంతుగారు ప్రతిరోజు రెండుగంటలసేపు వడుకుటయు. తరువాత మధ్యాహ్నంవేళ చాలాసేపు చదువుచును కాలంగ్రొద్దుపుచ్చుచున్నారు. వారు ప్రతిరోజు ఉదయము ప్రార్థనవేళ తనసహచరులను కలుసుకొందురు.

### సత్యాగ్రహంచేయని కాంగ్రెసు సంఘ సభ్యులు

తాలూకా, వార్డు గ్రామ కాంగ్రెసుసంఘాల కార్యనిర్వహకులుగానుండి సత్యాగ్రహంచేయనివారందరు వెంటనే ఎప్పుడు సత్యాగ్రహంచేస్తారో తెలుపవలసినదనియు అట్లుసత్యాగ్రహం చేసే ఉద్దేశ్యంలేనియెడల కాంగ్రెసు సభ్యత్వమునకు రాజీనామానివ్వవలసినదనియు సర్క్యులారు కాంగ్రెసుసంఘము అందచేస్తున్నట్లు తెలుస్తున్నది, ఈవిధంగా ఖాళీఅయ్యేస్థానాలు భర్తీ చేయబడవు.

### డా. యస్. బెనర్జిగారికి ౧౦ నెలల కఠిన శిక్ష

అఖిలభారత ట్రేడుయూనియను కాంగ్రెసు పూర్వాధ్యక్షుడు డా. యస్.వి. బెనర్జి (యం. యల్.ఎ.)గారు యుద్ధప్రతికూలప్రసంగాలుచేసిన నేరమునకై ఫిబ్రవరి౧౦వ తేది అలిపూరు సబ్‌డివిజనలుమేజిస్ట్రేటు ౧౦ నెలలకఠినశిక్ష విధించెను.

## భారతదేశము యెడ బ్రిటను యుద్ధాశయాలు

### ఇండియా మంత్రిగారి అమేరీ ప్రకటన

ఫిబ్రవరి ౧౨వ తేదిన ఇండియా మంత్రి యల్. యస్. అమేరీగారు లండనులో రోటరి యస్ క్లబ్బునందు సందర్భంలో ఉపన్యసించెను యుద్ధాశయాల ప్రశక్తి తెచ్చెను. "మనపూర్వీకుల స్వేచ్ఛాయుత సహకారంవల్ల ఏర్పడిన అత్యద్భుత సంఘవ్యవస్థను రక్షించు రాజకీయ, సాంఘిక మార్గాలద్వారా ఆ వ్యవస్థను మరింత వృద్ధిపరచుట" అను యుద్ధాశయాల నిర్వచనంతో ప్రస్తుతానికి తాను సంతృప్తిపడుచున్నట్లు తెలియబరచెను. "ఒక్క ఇండియా సంగతిని చూడండి. అది యూనపుతో పోల్చదగిన ప్రత్యేకఖండము. అపోలిక వైశాల్యానికి మాత్రమేకాదు, జాతిభేదములకుకూడా వర్తించును, అంతరంగిక శాంతి రాజకీయ, ఆర్థిక ఐక్యమత్యము అను పునాదులను మనము ఇండియాలో వేసినాము. ఈ పునాదుల మీద స్వతంత్ర ప్రభుత్వము అను భవనమును నిర్మించుకొనుటకు భారతీయ ప్రజలకు తోడ్పడుటకు మనము వాగ్దానముచేసినాము. ఈస్వతంత్ర ప్రభుత్వము భారతదేశములోని విభిన్నవర్గాలు సామరస్యములో పరస్పర సహకారముచేసి కొనుటకే, తమక్షేమానికే, తమరక్షణకు కృషిచేసికొనుటకే, బ్రిటిషు సామ్రాజ్యం అను పేరుతో వున్న స్వతంత్రరాజ్యాల సముదాయములో సమాన భాగస్వామిగా ఇండియాఅంతయు ఆత్మవిశ్వాసము పొందుటకే తోడ్పడవలదని ఆశించుచున్నాము. ఇంతకంటె ధర్మమైన కార్యాలను మరేదేశముకూడ ఆశయముగా పెట్టుకొనలేదని నిస్సంకోచముగా చెప్పవచ్చును. ఇది సులభమైన కార్యముకాదు. ఈ కార్యసాధనకు నిర్ణీతమైన ఒక మార్గంలేదు. భారతదేశపు క్లిష్టసమస్యలను పరిష్కరించుటకు పాశ్చాత్య సూత్రమేదిగాని పనికిరాదు. ఈ క్లిష్టసమస్యల పరిష్కారానికి మనము, మనతోపాటు భారతీయులు శక్తివంచనలేక రాజనీతితెలిసి ప్రవర్తించవలసి వుండును." అని అమేరీగారు చెప్పిరి.

—

## జూదమువల్ల కొట్లాటలు

(స్వ.వి.) దురాచిపల్లి, ఫర్వర్ది ౧౫

సూర్యాపేటకు మూడుమైళ్ళదూరమునగలదు. దురాచపల్లిగుట్టపై మాఘశుద్ధ దశమియుగరలకుసరియగు ఆదిసోమవారములందు యాదవుల జాతర జరిగెను. చుట్టుచాలదూరమునుండి వేలకొలది యాదవులు కుటుంబయుక్తముగానే తెంచిరి. బలి కోసకుటక్కై వేయికిమించిన గొర్రెలు వచ్చెను. హైదరాబాద జీవరక్షజ్ఞానప్రచారకమండలివారు వచ్చి అహింసనుగురించి భజన, ఉపన్యాసము, యక్షిణీదీపప్రదర్శనముల మూలమున మంచి ప్రబోధము కలుగజేసిరి. సూర్యాపేట, మిరియాలగూడెములనుండి ఆర్యయువకులువిచ్చేసి భజన, ఉపన్యాసములమూలమున అహింసా ప్రబోధము గావించిరి. కొందరుఅసూయాపరులు ఆర్యయువకులకు కష్టములుకలిగించ ప్రయత్నించిరి. కాని వారు అతిశాంతమువహించుటచే అన్నియు విఫలమైనవి.

### సంఘర్షణ

ఒకడు జాతరలో నాలుగువీధులు కలియుచోట జూదము ఏర్పాటుచేసెను. యాదవుడొకడు జూదములో కొన్నిరూపాయిలు తెండివెంట తాడు కోల్పోయెను. మరలఒక రూపాయికింద తెండికడియమువెట్టెను. అదికూడా వోడెను. రూపాయిదుస్తను, నాకడియమిమ్మనగా జూదగాడు నిరాకరించెను. గట్టిగా అనుగా మాటలుముదిరితగవులేచెను. దానిలో పలువురు ఇరుపక్షములచేరి కొట్లాడిరి. అందువలన జాతరయంతయు భయంకరస్వరూపమువాల్చెను ప్రజలువున్నరీతిగనే పరుగెత్తివెళ్ళి పదివేలమందియు ఒకగంటలో రెండువేలుమిగిలిరి. పలుపురుమహమ్మదీయులకు బలమైనగాయములుతగిలినవి. యాదవులలో కొందరికిబలమైన గాయములు, దెబ్బలుతగిలెను. కాని వాండ్లుస్వగ్రామమునకు వెళ్లుటచే సంఖ్య తెలియలేదయ్యె. పిమ్మట సూర్యాపేటనుంచిచి పోపోలీసుఅమీనా, సర్కిలుయినిస్పెక్టరు, తహశీలుదారు మున్నుపుగాస్టువెళ్లి పరిస్థితులను శాంతపరచి దెబ్బలుతిన్నవారినిపురమునకు తీసుకవచ్చి సర్కారి ఆసుపత్రిలో చేర్చిరి.

—

## రుమేనియాతో బ్రిటిషు సంబంధాల తెగతెంపులు

రుమేనియాలో బ్రిటిషు రాయబారిని బ్రిటిషు ప్రభుత్వం స్వదేశానికి పిలిపించినది. మిగతా రాయబార కార్యాలయోద్యోగులందరినీ వెంటపెట్టుకుని ఆయన ఫిబ్రవరి ౧౫వ తేదిన గాని ఆతర్వాతగాని ప్రయాణమై వెళ్ళును.

కొన్ని నెలలక్రింద కొద్దికొద్దిగా జర్మను సైనిక దళాలు రుమేనియాలో చేరుటప్రారంభించెను. అధికంగా జర్మన్ సైనికదళాలు రుమేనియాకు వచ్చుట మొదలు పెట్టినపుడు రుమేనియా ప్రభుత్వమువారు రుమేనియా సైనికులకు ఆధునిక యుద్ధవిధానంలో శిక్షణయిచ్చుటకు మాత్రమే జర్మనులు వస్తున్నారని బ్రిటిషురాయబారికి తెలియచేసిరి. రుమేనియా సైనికులకు జర్మను సైనికులు కొంతశిక్షణయిచ్చినమాట నిజమే. ఇట్లుశిక్షణయిస్తూనే జర్మనులు రుమేనియాలో దాడికి అవసరమైన హంగామా నంతటినీ చేకూర్చుకొనిరి. అనేక కీలకస్థానాలలో జర్మను ఆయుధసామగ్రినీ, పెట్రోలును సమకూర్చుకొనిరి. ఈవిధంగా జర్మనులు యుద్ధనిర్వహణ విధానంలో తమ ఎత్తులను కొనసాగించుకొనుటకు రుమేనియాను ఆశ్రయంగా ఉపయోగించుకుంటున్నారు.

జర్మన్లు ఈ చర్యలన్నిటినీ సాగించుచుండగా ప్రభుత్వం ఏవిధమైన ఆక్షేపణనూ తెలియజేయలేదు. ఈపరిస్థితిలో బ్రిటిషు రాయబారవర్గం వారికి తమపరిస్థితి చిక్కుగా కనిపించినది. అందు రుమేనియాచేత బ్రిటిషు ప్రభుత్వంవారు తమరాయబారి పర్ కిజివాల్లుహోరునూ, వారి సిబ్బందిని స్వదేశానికి వచ్చివేయవలసినదనినారు.

జర్మనీ మిలటరీ పానులకు రుమేనియా తోడ్పడుచున్నదని బ్రిటిషుప్రభుత్వము ప్రకటించినది.

రుమేనియాతో బ్రిటను సంబంధంగురించి బ్రిటిషు పార్లమెంటు కామన్సుసభలో కొన్ని ప్రశ్నలకు జవాబిస్తూ బ్రిటిషు విదేశమంత్రి ఆంథోనీ ఈడెన్ ఇటీవల జనరల్ అంటనెస్కూకు బుఖారెస్టులోని బ్రిటిషు రాయబారి అందజేసిన పత్రము చదివెను. అందులో ఈ విధంగానున్నది.

"గతించిన ౬ నెలలనుండి మీ చేతిక్రింద నడుచుచున్న ప్రభుత్వం పూర్తిగా జర్మనీకి లోబడినట్లు స్పష్టమగుచున్నది, కళ్ళ ఎదుటజరుగుతున్న సంగతులూ, తరుచుగామీరుచేసిన ప్రకటనలూ ఈవిషయమునే తెలుపుచున్నవి, జర్మనీ తన సైనికచర్యలకు రుమేనియాను ఉపయోగించుకొనుటకు సన్నాహాలు చేస్తున్నందున నా రాయబార కార్యాలయాన్ని ఎత్తివేయుచున్నాను."

—

